# కృతి సమర్పణము

## గౌ. శ్రీ మండలి వేంకట కృష్ణారావుగారికి

మండలివంశభూషణుఁడు, మానిత సద్గుణభూషితుండు, బ్ర
హ్మాండము బ్రద్దలైన తన మాటకు జీవము పోయు నిత్య స
త్యుండు, కళామతల్లి దయతోఁ గరుణించిన ముద్దుబిడ్డ, క
న్పండువుగా మదీయకృతి భర్తగ నాకు లభించె నిద్ధరన్ ! 1

నవనీతంబు మనంబు, పల్కులను విన్నాణంబు వర్ధిల్లు మా
నవతాదేవి హృదంతరాళమున నందం బొప్పఁ గొల్వుండు సం
స్తవనీయంబగు కీర్తికన్నియ ప్రమోదం బంది కేల్సాచు, నీ
భువిలో వేంకట కృష్ణరాయఁ డల "బాపున్" జ్ఞప్తికెత్తున్ సదా ! 2

గౌతముఁడు, క్రీస్తు, గాంధియు
భూతదయాతత్పరులు ; ప్రబోధంబులచే
నీతిని గరపిన వారలు !
భూతలమున శాంతి నిల్పి పోయిరి మనకున్. 3

వారల శాంతిమార్గమును, వారల భూతదయాపరత్వమున్,
వారల నీతిబోధనము, వారల నిత్యవినిర్మలత్వమున్.
వారల కార్యదీక్షయును, వారల మానవతాప్రబోధమున్.
వారల సత్యవాక్యపరిపాలన "మండలి"యందు వెల్గెడిన్. 4

ప్రజలే మండలి, మండలి
ప్రజలై జీవించి రామరాజ్యము నాంధ్ర
ప్రజలకు చవి చూపెను పో
సుజనులు మెచ్చంగ దేశజులు రంజిల్లన్. 5

ప్రకృతి బీభత్సమునకు సర్వమును కోలు
పోయి విలపించు వారల మూగబాధ
తనదిగా నెంచి, యశ్రులు కనుల నించి
సత్వరము సాయ మిడె దయాశాలి యపుడు. 6

మము బోటి సన్నజీవుల
మమకారంబునను చూచు, మానక యెవుడున్
శ్రమజీవులఁ గరుణించెడి
విమల యశోధనుఁడు తలఁప వేంకటవిభుఁడున్. 7

నవ నవనీత మానసముతో నెల్లర
సమముగా వీక్షించు సాధుశీలి
అమృతంపు పలుకుల నత్యాదరంబున
పలుకరించెడి మహా భాగ్యశాలి
చెప్పెడి మాటలు చేతలై వర్ధిల్లు
తిరుగులే నటువంటి దీక్షితుండు
అన్ని మతాలకు నాదరంబును చూపి
నెగడెడు దైవసాన్నిధ్యవర్తి,

మధుర హృదయుఁడు, విజ్ఞాని, మహితయశుఁడు,
ఆంధ్రప్రజలకు నాప్తుఁ డైనట్టివాఁడు,
ప్రజలె కోటగా కలిగిన సుజన వినుతుఁ
5 డిలను మండలి వేంకటకృష్ణ విభుఁడు. 8

బుద్ధ బోధనలను భువిలోన వ్యాపింపఁ
జేయఁగలుగు క్రియలు చేయువాఁడు
కీర్తిఁ దనరువాఁడు కృతిభర్త తా నయ్యె
6 బుద్ధచరిత కెంత పుణ్య మవని ? 9

శ్రీ కల్యాణగుణాభిరామమయి, నిర్జీవ ప్రపంచంబునన్
లోకుల్ కంపిల. బాధఁ బాపెడి దయాళుత్వంబు, నిర్వాణ మా
ర్గాకారంబును, శాంతిజీవన మహత్త్వంబున్న సద్గాథ నే
7 మీ కర్పించితి, స్వీకరింపు మిదె స్వామీ ! బుద్ధచారిత్రమున్. 10

యం. పి. జాను

# అభిప్రాయము

డా॥ దివాకర్ల వేంకటావధాని,
ఎం. ఏ. (ఆనర్సు), పిహెచ్. డి.

శ్రీ ఎం. పి. జాన్‌గారిదివఱకే నాలుగైదు సరసమధురములైన కావ్యములు రచించి ఆంధ్రదేశమున పేరు గాంచినవారు. వారు పల్నాటి చరిత్రను వర్ణించుచు నిటీవల రచించిన మహాకావ్యము భాషాభావములచే నాధుని కాంధ్రసారస్వతమున కలంకారమని చెప్పఁదగినది. ఇప్పుడు వారహింసామూర్తియు, కరుణాసముద్రుఁడు నైన గౌతమబుద్ధుని జీవితమును సర్వజన మనోహరముగా రచించి, ఆంధ్రవాణికి క్రొంగ్రొత్త కానుకగా నర్పించియున్నారు. ఆంధ్రదేశమున మహానుభావుఁడైన బుద్ధుని జీవితమును కావ్యములుగా రచించిన వారనేకులున్నారు. శ్రీరాముని చరిత్ర వలె నెవ్వ రెన్నివిధముల రచించినను సహృదయ సముదయమునకు విసువు గొల్పని దివ్యచరిత్ర మది. బుద్ధుఁడు జనించి జ్ఞానవికాసమునంది దానిని తోడి మానవుల కందటికి నమృతమువలెఁ బంచి వారికి తరణోపాయము చూపువఱకు నతని జీవితమునఁ గల ముఖ్యఘట్టముల నన్నిటిని శ్రీ జాన్‌కవిగారిందు హృద్యానవద్యముగా వర్ణించియున్నారు. సంఘర్షణము, జ్యోతిరవతరణము, సందర్శనము అను భాగములు బుద్ధుని మానసమునఁ గలిగిన పరివర్తనమును, అతఁడు లోకమున కొసంగిన సందేశ

మును సరళసుందరముగా వర్ణించుచున్నవి. అచ్చటచ్చట బుద్ధునికరుణా మయత్వమును దెలుపు కథలు రమ్యముగా రచింపఁబడినవి.

శ్రీ జాన్‌కవిగారికి భగవత్కృప వలన జాతీయము, సులభము, శక్తిమంతము నైన శైలి యలవడినది. వారి ధారాశుద్ధి నిరర్గళమై పఠితలచే పద్యమును పలుమార్లు చదివించును. వారు వృత్తిచే అన్యవ్యా సంగము కలవారయ్యు నిరంతరకృషిచే నాంధ్రసారస్వతము నంతను బఠించి తెలుఁగుభాష జీవమును పట్టుకొనఁజాలిరి. వా రచ్చటచ్చట దీన మానవులనుగూర్చియు, వారి పరిస్థితులనుగూర్చియు వ్రాయు పద్యములు సహృదయ హృదయద్రావకములుగా నుండును. వారిశైలి యెంత ధారా ళమో అంత నిర్దుష్టము. ఈ రోజులలో నింత హృద్యముగను అనవద్య ముగను పద్యరచన కావించువారరుదుగా కనిపింతురు. ఇట్టి రసభరితము సుందరము నైన శైలి పూర్వసుకృతముచేఁగాని పట్టువడదు.

శ్రీ జాన్‌గారీ కావ్యమును కరుణామయులు మాజీవిద్యాశాఖామా త్యులు నైన శ్రీ మండలి వేంకట కృష్ణారావుగారి కంకితము చేయుట యత్యంతోచితమై సువర్ణమునకు సౌరభమును కలిగించుచున్నది. పరమే శ్వరుని కృపవలన కవిగారింకను రసవన్మనోహరము లైన రచనలు కావించి ఆంధ్రసరస్వతి కభినవాలంకృతులు సమకూర్తురు గాక !

దివాకర్ల వేంకటావధాని

## జ న న ము

శ్రీరంజిల్లుచు సౌఖ్య సు
ధారస ధారలను చిల్కు ధరణీతలిపై
భారతి హిమవద్గిరి శృం
మకుట ధారియగుచుకల కలలాడున్ 1

పెట్టని కోటగా నిలిచి పేరు ప్రతిష్ఠలు సంతరించి స
మ్రాట్టుగ నిల్చు భారతి శిరంబున వెల్గు కిరీట భూషయై
పట్టముకట్టి జాహ్నవికి ప్రాకుట నేర్పియునిగ్గిరీంద్రమే
పట్టెను భారత ప్రజల పౌరుష కీర్తికి నిల్వుటద్దమున్ 2

ఆ కొండ మహిమలెంచిన
నే కొండలకైన గుండె నీరై కరఁగున్
ఆ కొండ చలువలెంచిన
నే కొండలునైన పసిఁడినేలగమారున్ : 3

తామరతంపరై తనిసిన ప్రజలలో
సంతృప్తి యేనాడు సడలలేదు;
దిక్కుల కెగఁబ్రాకు దేదీప్యమౌ కీర్తి
చంద్రికలందు మచ్చలును లేవు,
ఎందు కొఱఁతలేదు మందార మకరంద
మధురమైన తీపిమాటలాడి
జనకు కర్ణయుగళి సద్భూషణములిచ్చి
ముద్దుపట్టికూర్చు ముదముదక్క! 11

తనరూపంబును ప్రేమతో కనిన సంతానంబులోఁజూచి, మో
మునముద్దుల్ చిలికించు భాగ్యమిలనే పుణ్యవ్రతప్రాప్తమో
మనసానంద పయోధిదేల్చుటకు సంపన్నృత్యముల్ కాదు, నం
కోటన్విను ముద్దుమాటలె మహానందామృతైశ్వర్యముల్: 12

తప్పటడుగుల జనకునిదరికిఁజేరి
బోసినోటితోనెదొ చెప్పఁబోయి, సంజ్ఞ
చేసి చూపించు పసిబాలు చేష్టచూచి
మురిసిపోవుటె స్వర్గానుభూతి భువిని : 13

భావి జీవితముం సౌరభములనెల్ల
మోసికొనివచ్చి మనుజులముందునిల్పు
మొలక తెమ్మెరలే స్వప్నములను పేరఁ
బిలువఁబడుచున్న పీథరాతలముఁనందు : 14

చల్లనిరాత్రి శాక్యకుల చంద్రుని పట్టపుదేవి 'మాయ' వి
ద్యుల్లలితాంగ శోభితలు దూతలు తన్ను విమానమందునన్
మెల్లనకొంచుఁబోయి యలమేలిమి నీటను స్నానమార్చి, శో
భిల్లెడి సింహపీఠిఁ గనువిందుగ నుంచిన నొక్కయేన్గు రా
జిల్లుచువచ్చి గర్భమునఁజేరినయట్లొక స్వప్నమున్ కనెన్ : 15

కలగనిమేలుకొంచి మదిభ్రమ్మినచీకఁటిపోయి మోము జా
బిలి వెలుగొంద, కాంతవినిపించెనిజేశున, కమ్మహీశుఁడున్
పిలువఁగనంపె స్వప్నఫలవేదుల ! వారు "జయం" బటంచునా
కలవిని చెప్పసాగిరి ముఖంబుల కాంతులు చిందులాడఁగన్ : 16

"ధర్మమిచ్చోట నాల్గుపాదముల నడచు
రాణి కరుణాతరంగాంతరంగ ! స్వప్న
మల ప్రశాంత నిశాంతంబునందువచ్చె
శుభములకు నింకకొదువవచ్చునె మహీశ ! 17

చల్లనివాఁడు, కీర్తిశుభ చంద్రికలిమ్మహి నాల్గు దిక్కులన్
జల్లెడివాఁడు, శాక్యకుల చంద్రుఁడు, రూపమునందు చిత్తజున్
ఎల్లిదపర్చువాఁడు, పరమేశ్వరుఁడై ప్రజనేలువాఁడు, సీ
తల్లికి ముద్దుబిడ్డఁడు, ముదంబిడు పుత్రుఁడు పుట్టునో ప్రభూ ! 18

రాజచంద్రుఁడై నిఖిల భూరాజ్యరమను
పాలనముచేసి కీర్తి చేపట్టఁగలఁడు
అట్లుకాదేని విమలవాగమృత ఝురిని
జగతి నుద్ధరించెడి మునిచంద్రుఁడగును : 19

సంతానంబను మాట విన్న విభుడున్ సాంతంబు సంతోష పుం
బంతుల్ పూయఁగలేఁతనవ్వులను "వహ్వా ! నేడు, జీర్ణించి నా
స్వాంతంబున్ మెలివెట్టు కోరికలు సర్వస్వంబు సీడేరె నా
చింతల్ దీరెను ! మోడుమాకులును పూచెన్ మల్లియల్ కొల్లగా 20

అని హర్షాంబుధినోలలాడెడు ప్రభుండా స్వప్నవేదాంతులన్
ఘనమౌ కాన్కలతోడ నంపి, తన శంకన్మాప దేవేరి నోఁ
చిన నోముల్ ఫలియించెనంచు ధనరాశింజూచు చందంబుగా
కనియెన్ పట్టపుదేవి మోము సకలంకంబైన చంద్రుండుగా : 21

కరుణ రసంబు వెల్లువలుగా ప్రవహించెడి రాణి భూ జనో
ద్ధరణమె జీవితంబున ప్రధానముగా గల ముద్దుపట్టి సుం
దర వదనారవింద శుభదర్శన భాగ్యము కల్గునంచు భా
18 సుర దరహాస శోభిత విశుద్ధ ముఖాంబుజయౌచు నిట్లనున్ 22

"ప్రాణనాథ! ముద్దుపట్టికి తల్లినై
మురిసిపోవు భాగ్యమునకు నోచి
ధన్యమయ్యె జీవితము మీకు సేవలు
19 సేయుకతన, మచ్చమాయుకతన !" 23

అని హర్షాశ్రులు చిందు ప్రాణసతి ప్రేమావేశపుం బల్కులన్
వినుచున్ భూపతిరాణి, కన్నుఁగొనలన్ వీక్షించి బాష్పంబులన్
తనగోటన్ వడి మీటి "ధన్యవుకదా ధాత్రీతలంబందు! నీ
20 కును నాకున్ గనువిందుచేయు తనయున్ కూర్మిన్ ప్రసాదింపుమా!" 24

అనుచును ప్రియసతి నెమ్మో
మున, తమ కనఁబోవుబిడ్డ ముద్దుల నగు మో
మును కాంచి హర్షవార్నిధి
21 మునుఁగుచు లేచుచును రాజు ముగ్ధుండయ్యెన్ : 25

రాణి వదనంబు గనినంత రాజు మురిసె
రాజుఁగనినంతనే రాజ్యరమయు మురిసె
రాజ్యరమఁగనినంత భూరమణి మురిసె
భూమిఁగనినంత స్వర్గభూములును మురిసె ! 26

అక్కసంతా నవతి యగునన్న వార్త
పడెను చెవిలోన నా ప్రజావతికి, నామె
బిగ్గ కౌగిట నక్కనునిగ్గదీసి
ముద్దులను ముంచినది చెక్కుటద్దములను. 27

కాలుమోపగరాని కాఱడవులను సుం
దరమైన నవనందనములు వెలయు !
గాలికినూగు పాకలుపోయి నింగిని
ముద్దాడు సౌధముల్ ముద్దుగొలుపు !
పాషాణమై సాగుబడిలేని కఱకు నే
లలు చూడ మాగాణములుగ మారు!
గతిలేక మృత్యుముఖమునఁ జిక్కినవాఁడు
దీర్ఘాయువై భూమి తేజరిల్లు !

బానిసలు రాజులై కీర్తి పడయగలరు
కుంటిగంతులువైచుచు కులుకఁగలఁడు
అవని గొడ్రాండ్రు సంతానమందగలరు
దైవకార్యంబునకు నసాధ్యంబుకలదె ! 28

26

మోద బాష్పంబులనెడి పూవులను చల్లి
డెంద మలరించు చూపుల గంధ మలమి
రాగబంధ రత్నాల సరాలఁ వైచి
ప్రణయపూజలు సల్పె భూవరుడు సతికి : 29

27

జననాంతర పుణ్యఫలం
బును తార్చినయట్లు 'మాయ' మురిసెను గర్భం
బును తాల్చి ! రాజు శుద్ధో
దనుఁడును మురియంగ రాజధానియు మురియన్ ! 30

తినుట మానదు వంటవండిన లతాంగి
కనుట మానదు గర్భిణీ వనిత ధరణి
నిండుచుండెను రాణికి నెలలునంత
పండుచుండెను రాజు తపముల పంట. 31

కోరిన ఫలముల నొసఁగి యు
దారతఁ జూపించు కల్పతరువో యనఁగా
శ్రీరమ్యాకృతినల "మా
యా" రమణిచరించు రాజు హర్షము పూనన్: 32

కోరిక కలిగిన వెంటనె
తీరుచు నారాజు, తనసతిని ముద్దుల సిం
గారించి చూచుకొను తీమి
తీరఁగ, తనతలఁపు తీయతీయఁగ మారన్ 33

ముఖమె చెప్పనుగద తలంపులను, వాని
తెలిసికొందురు ధీయుతుల్ ! తెలిసికొనియె
శాక్యభూపతి సతి మానసమున నున్న
తలఁపు ! చూలాలికింగల్గు తలపు భువిని ! 34

పండిన భాగ్యరేఖయగు పట్టినిదాలిచి శాక్యవంశమున్
పండఁగఁజేయురాణి కనుపండువు సేయఁగదేని యాశలున్
పండెను ! భూమి తల్లియును పండెను పచ్చగ ! రాణిగారికిన్
నిండెను మాసముల్, మనసు నిండెను హర్షము పుట్టినిల్లనన్ 35

నవ్య నవనీతమైన మానసముతోడ
కోమలంబైన రథముపైఁ గూరుచుండె
వినుత గుణముల ఖని శాక్య విభుని రాణి
చెల్లి వెంటరా తనదు పుట్టిల్లు చేర ! 36

32

పసరు టాకులతో నేత్ర పర్వముగను
తలలు వంచిన పంట భూములను కాంచి
పాల పాపను, తన నోముపంటఁ దలఁచి
చాల మురియును నిండు చూలాలు రాణి : 37

33

తిన్నని ఋజు మార్గంబున
కన్నుల కత్యంత ముదము కల్గగ ప్రకృతిన్
చిన్నారి చెల్లి తానును
కన్నాకు రథంబు మెల్లగా పయనింపన్ ! 38

34

గుండెలోనుండి చలువలు క్రుమ్మరించు
చలిమలను కాంచినారు రాణులు, ననంత
మహిమ కలిగిన గిరిరాజమౌళిఁ గూర్చి
చెప్పసాగె పట్టపుదేవి చెల్లితోడ ! 39

35

"త్రోసిపుచ్చెను! చెల్లి రోవరూధిని ప్రేమ
 పాశ. బంధంబును ప్రవరుఁ డిచట!
దోసిలొగ్గెను! ప్రేమతో కొండ రాచూలి
 వలపు పూవుల మహేశ్వరుని కిచట:
మాసిపోయెను! చెల్లి మదనుని రూపు, ము
 క్కంటి కన్మంటలో కరఁగి యిచట!
వాసికెక్కెను! వెల్లువగ నేలపై దూకి
 కరుణా తరంగ గంగమ్మ యిచట!
ననుచు సిద్ధ సాధ్యాంగన లనుదినంబు
చెప్పికొనుచుందురే ముద్దు చెల్లి వినుము
అంబరము నంటి ముద్దిడు నగ్గి రీంద్రు
తలను, తలనెత్తి నీదు కన్నులను కనుము!" 40

లలితములై, యతి శోభా
కలితములై పిల్లగాలి కంపనములతో
నలవోకగ నటు నిటు నా
కుల నూపెడి పలు లతాని కుంజము లందున్ — 41

రథము సాగుచునుండె; నా రమణులంత
నిలుపఁ గోరిరి యట "లుంబినీ" వనమున
సఖుల విశ్రాంతి గొనుఁడని శాక్య రాజ్ఞి
చూచుచుండె తద్వనమున శోభ లెల్ల: 42

ప్రసవ వేదన రాణి కారంభమాయె
వట కుటీరంబు చెలియ లేర్పరుప, పాల
కడలిలో నుండి యమృతంపు కలశమట్లు
నుద్భవించె మహా మహిమోజ్జ్వలుండు: 43

40

బాలకుని గాంచినంతనే ప్రసవ వేద
నను క్షణంబున మఱచిపోయినది రాణి
బాలకుని లేఁత నవ్వు ముత్యాల మోము
ధరణి నౌషధ మేమొ వేదనలఁ బాప: 44

41

భూదేవి తనదు సొమ్ములనెల్ల ధరియించి
బాలకునకు ఘనస్వాగత మిడె!
చిరుగాలి కెరటాలు చెలరేగి మెల్లఁగా
వింజామరలు వీచి విందు చేసే!

పూల బాలలు బాలుమోమును కనుఁగొని
పులకించి పాదాలు పూజచేసే !
రోహిణీ నది బాల మోహనాంగుని సము
త్తుంగ తరంగాలతో నుతించె !
జనని 'మాయ' గుండె స్తన్యమై ప్రవహించె
భూమి స్వర్గమగుచు పులకరించె
లుంబినీ వనంబులో నందనము పూచె
కువలయంబు మేలుకొనుచు నవ్వె ! 45

తెలిపిరి రాజసేవకులు తీయని వార్తను ! రాజు రత్న రా
సుల నిడెమెచ్చి వారలకు సూడిదగా ! హృదయేశ్వరిన్, మహో
జ్జ్వలుఁడగు బాల శాక్యకుల చంద్రుని వేగమతోడి తేరఁగా
బలికెను ! పట్టణంబున సువర్ణ ప్రదీప్తి చెలంగె నత్తరిన్ ! 46



# బాల్యము

జయమగు పట్టపు దేవికి !
జయమగు శ్రీ శాక్య బాలచంద్రున కవనిన్
జయమగు శుద్ధోదనునకు !
జయమగు ధర్మమున కెపుడు ! జయముర్వరకున్ ! 1

స్వాగత గీతావళి మా
ర్మోగుచు నాకాశ మార్గములు నిండారం
గా గృహలక్ష్మికి బిడ్డకు
స్వాగతమిడె భూపు డమృత వాక్పూరములన్ ! 2

విందులు చేయువారు కనువిందుగ వీధు లలంకరించు వా
రందము చిందులాడ దరహాసపు వెన్నెల లొల్కువారు నా
నందముతోడ శాక్య విభునందను ముగ్ధ ముఖారవిందమున్
సందరిశించువారునయి శాక్య ప్రజల్ పులకించి రత్తరిన్!

45

46

ఎక్కడఁ జూచినన్ పసరు లీనెడి మంగళ తోరణంబులే
ఎక్కడఁ జూచినన్ కనుల కింపగు సుందర చిత్ర పంక్తులే
ఎక్కడఁ జూచినన్ సిరి వసించెడి మేలిమి పన్నె మ్రుగ్గులే
చక్కని శాక్య చంద్రుని ప్రశాంత సుకాంతుల నవ్వు పువ్వులే ! 4

వేద ఘోషలు వినువీధుల విహరించి
యుత్తేజమును కూర్చు నొక్కచోట !
కాలియందెలు ఘల్లుఘల్లున మ్రోయించు
చక్కని నాట్యంబు లొక్కచోట !
గాత్రంబుతో రాలు కరగించి, మనసుల
నూగించు గానంబు లొక్కచోట !
కవివరేణ్యుల భావ గంభీర సుమనోజ్ఞ
యుక్తి వైచిత్ర్యంబు లొక్కచోట !
పల్లవాధరల సుభాషణ లొకచోట
పల్లెపడుచు వంతపాట లొకట
మరులుకొల్పు గంధ పరిమళ మ్మొకచోట
రాజసంపు తూర్యరవము లొకట ! 5

కపిలవస్తు పురము కలకల లాడెను
రాజ మందిరాన రవల మెట్టి
యలు ధ్వనించె ! మంగ ళారతు లెత్తిరి
పుణ్యవతికి తలిరు బోడు లెల్ల ! 6

పాల నవ్వుల చిన్నారి బాల ముద్దు
మొగము జాబిలి వెలిఁగించె ముజ్జగముల
శాంతిదేవత మరిసి ప్రశాంత మధుర
భావ గీతాలు తనలోనె పాడు కొనియె ! 7

"అసితుం డను నొక సన్ముని
పసిబాలుని జన్మమెట్లు పసికట్టెనొ ? యు
ల్లసితాత్మ నచటి కరుదెం
చె ! ససంభ్రముఁడగుచు రాజు సేవలు చేయన్ ! 8

బాలుని చూపినారు మునివర్యున కంతట తన్మయాత్ముఁడై
పాలము ముద్దులాడి పసిబాలుని పాదము లెత్తి రెండు నే
త్రాలకు నద్దుకొంచు మునిరాజు "మహాత్ముని చూడఁ గల్గితిన్
జాలును జన్మమింక నది సార్థకతం గనె" నంచుఁ బల్కుచున్ !9

"జగ దుద్ధారణ చేయు కోసరమె తాజన్మించె పాపాయిగా
నగు మోముం గని లోకముల్ వెలిఁగె, సంతాపంబులున్ మాసెమా
నుగ కైవల్యము పంచి పెట్టుటకు నెన్నో రూపముల్ దాల్చి చ
ల్లగ లోకంబుల నేలువాఁడు జనపాలా నీదు బిడ్డం డహో ! " 10

అని మునిరాజు రాజు హృదయంబును హర్షము తోడ నింపి, ఇ
చ్చిన ఘనమైన కానుకలను చేకొని పోయెను, మాతృమూర్తి నం
దను వదనారవింద శుభ దర్శన భాగ్య మహోత్సవంబులో
మునిఁగెను తల్లి మోము గని ముద్దుల బాలుఁడు నవ్వు చుండఁగన్ 11

ఆ చిరు నవ్వులోనఁ దెలియంగ ననూహ్యము లైన వేదముల్
తోఁచెను!లోక బంధముల తుత్తునియల్ పొనరించు తేజముల్
పూఁచెను,శాత్త్వికుల్ మురిసి పోయెడి తత్త్వము లెన్నియో తలల్
సాఁచెను,శాంతి దేవత ప్రశాంత మనోరథముల్ ఫలింపగా. 12

బాల శశాంకు కైవడి నృపాల కుమారుఁడు వర్ధమానుఁడై
జోలలు వించు నూయెలను చూచుచు, రాణి ముఖంబు గాంచుచున్
బాలకు గోల చేయుచు, సపర్యలు చేయగ తృప్తి పొందుచున్
బాలుర చేష్టలోఁగల యపార సుఖంబును కూర్చె తల్లికిన్ ! 13

కాంతు లీనెడి కన్నుగవ లోన నవలెత్తు
సొగసులు పలుమారు చూచి చూచి,
చిదిమిన పాల్గారు చెక్కు టద్దాలపై
వింత ముద్దుల ముద్ర వేసి వేసి,
కదలుచు నాఁకలిగాఁ జూచు తనముద్దు
పట్టికి చనుబాలు పట్టి పట్టి
నిదురలో నటు నిటు మెదలెడు పసిబాలు
నుయ్యేలలో నుంచి యూపియూపి

మాతృ ప్రేమలోని మాధుర్య మహిమలు
ప్రీతి తోడ పంచి పెట్టి పెట్టి
గుండె పైని బాలకుని చేర్చి స్వర్గాను
భూతి లోన కనులు మూసె తల్లి ! 14

పరమానందమొ పారవశ్యమొ మహా భాగ్యోన్నతంబౌ మహే
శ్వర సాన్నిధ్యమొ రాణి జీవిత సుఖాశ్వాసాంతమో భావ బం
ధురమో కాలము చేయు గారడియొ బంధుత్వంబులన్ బాసి యే
చిర జీవత్వములోనఁ జేరుటయొ మూసెన్ రాణి కందోయినిన్ ! 15

అలికిడి లేదు రాణి హృదయంబున శ్వాసయు లేదు ! కాలుసే
తుల చలనంబు లేదు,కనుదోయికి మూతలు వీడలేదు,మా
టలు వినరావు మోము చెమటం దడిసెన్ దయలేని దేవుఁడెం
దుల కిటువంటి కష్టములనుం గలిగించునొ రాతి గుండెతో ! 16

ఆలు మగలలోన నమవస సృష్టించి
యంతు లేనట్టి గల్లంతు చేయు
తండ్రి కొడుకులకు తగవు లాటలు పెట్టి
ఎడమోము పెడమోము లేర్పరచును
ధన మున్నచోట సుగుణము నీయక తార
తమ్యంబుతో ననర్థంబు కూర్చు,
కనుపాప వలె బిడ్డలను కాచు తల్లిని
క్షణములో తనలోకమునకుఁ బిల్చు

ముదము లోనఁగూర్చి దానిలో ముప్పు తెచ్చు
ముప్పు లందున నేదేదొ ముదము కూర్చు
పూట పూటకు నీజగన్నాటకమును
నడపు వానిది గుండెయా నల్లబండ ? 17

నిలువునఁ గూలెను జనపతి
తులలేని సతీ వియోగ దుఃఖంబున గా
డ్డలితో నఱుకగ ఫెళ ఫెళ
నిలపైఁబడినట్టి భూరి వృక్షము భంగిన్ ! 18

అక్క శిరమును తనదు ప్రేమాంక మందుఁ
జేర్చి, కన్నీళ్ళు చెక్కిళ్ళ చిందు లాడ
కంపనము చెందినది సుడిగాలి వలన
సోలు సుకుమార మగు లత వోలె చెల్లి 19

శోక తప్త మానసు లయిరి పౌరులు
రగిలె పొగల శాక్య రాజ్య లక్ష్మి
అంధకార మందు నలమటించిన వంతి
పురము కపిల వస్తు పురము నాడు : 20

బాలునకు తల్లి లేని లోపమును తీర్చి
సాక సాగెను చెల్లి ప్రజావతి, యను
రాగ రసమును పాలలో రంగరించి
ముదముతో బాబు దినది నాభ్యుదయ మొంద. 21

పసిఁడి పండు వంటి పసిబాలు వదనంబు
వింత వింత యైన వెల్గు లీన
రాజు మోముదమ్మి ప్రభల నీనగసాగె
మనసు గాయ మెల్ల మాన సాగె 22

నఱుకుడువడి వట వృక్షము
తిరిగి చినుకు తాకి సాగు తీరున సుతులేఁ
జిరునవ్వు లొనఁగలయమ్మ
తరసమ్మున కోలుకొనియె ధాత్రీ ధవుఁడున్. 23



మనసున రేగిన గాయం
బును మాన్పఁగఁ జాలు కాల పురుషుని చేష్టల్
కనుఁగొన నశక్య మెంతటి
ఘనులకు, సుర సిద్ధ సాధ్య గంధర్వులకున్ ! 24



ఉల్లము పల్లవించి తనయుం గని నంతనె రాజు గుండెలో
వెల్లువగా స్రవించినది ప్రేమ సుధారస వార్ధి కన్నులన్
జల్లులు చిందె మోదమున, చల్లని పాల వెలుంగు లేఁతజా
బిల్లి ముఖంబునం బలికె వీణలు మాటలు లేని భావమున్ ! 25

ఆ చిరునవ్వు చీఁకటుల నంతము చేయఁగ జాలు ! లీలగాఁ
జాఁచిన చేయి భూమిని వసంతము నింపఁగఁ జాలు ! చల్లఁగా
చూచిన చూపు స్వర్గమును చూపగఁ జాలును ! ముద్దు ముద్దుగా
లేచిన ధర్మదేవతయు లేచును లీలగ మోహనాంగియై ! 26

తన కోర్కెల్ నెరవేర్చు బాలునికి చింతల్ దీర్చి మోదంబు కూ
ర్చిన గారాల వరాల బిడ్డనికి చూచీ చూడకే మానసం
బును వెల్గించెడి దీప్తిమంతునకు సొంపుల్ చిందు చిన్నారికిన్
జననాథుం డొగి పేరు పెట్టె ధరణిన్ "సర్వార్థ సిద్ధుం"డనన్ 27

అక్క మనంబు లోన కదలాడ, ప్రజావతి చిట్టి బాబులేఁ
జెక్కిలి పైని ముద్దు లిడు చిక్కని ముంగురు లల్లు మెల్లఁగా
నక్కునఁ జేర్చి తీయ తియనైన సుఖంబులఁ దేలియాడు పె
న్మక్కువ తోడ గౌతమ కుమార "యటంచును బుజ్జగించెడున్ 28

కొందరు గౌతముఁడనగా
కొందరు సర్వార్థ సిద్ధకుండని పిలువన్
కొందరు సిద్ధార్థుం డన
నందెలు మ్రోయించు బాలుఁ డానందమునన్ ! 29

దిన దిన వర్ధమానుఁడయి తీయని స్వప్న ఫల ప్రసూనమై
కనులకు పండువై విమల గాన ఝరీ భువనైక ముగ్ధ మో
హనములు రేని యాశల మహా సుమ సౌరభ రాశియై ఘనా
ఘనవిభ వాంచితుం డనఁగ కాంతులు చిమ్మెడు శాక్య బాలుడున్ 30

తనయుని పెంచ సాగె పినతల్లి ప్రజావతి కంటి పాపగా
జనకుని మాన సాంబర ముషః కిరణ ప్రభ లీను చుండఁగా
జను లతిమోద మొందుచు ప్రజా పతి క్షేమము కోరుచుండగా
కనుల వసంత శోభలను కట్టె దిశా వలయంబు పచ్చనై ; 31

బుడి బుడి నడకల బాలుఁడు
నడుగిడగా తల్లి మిగుల ననురాగముతో
వడి వడి నెదు రేగును ; ప్రే
ముడి కడు తొందరలు సేయ ముద్దుల నింపున్ ! 32

పులకిత గాత్రంబున వ
న్నెల చిన్నెల బాలు నెత్తి నిర్మల వారిన్
జలకము సవరించి, నుదుట
తిలకంబును తీర్చి దిద్దు దీప్తులు నిండన్ ! 33

నెరికురు లల్లును, పువ్వులు
తురుమును, పినతల్లి ప్రేమతో చెక్కిలిపై
కురియును ముద్దుల వర్షము
చరచర గౌతముఁడు సాగ సంతస మొందున్ ; 34

గజ్జెలు ఘల్లన నాడును
ముజ్జగములు తన్మయత్వమున నిండారన్
గుజ్జన గూళ్ళు భుజించును
బుజ్జాయి ముదాన నవ్వుపువ్వులు చల్లున్ ! 35

అమ్మా యన బాలుని వ
క్షమ్మున నిడి హర్ష బాష్ప జల లోచనయై
కమ్మని మమకారంబున
నిమ్మహినే మరచు తల్లి హృదయము కరఁగన్ ! 36

కిలకిల బాలుఁడు నవ్విన
కలకల లాడెదు ననంత కాంతులమోముల్
తలి దండ్రుల కది సహజము
తలమే వర్ణింప తల్లి దండ్రుల ముదమున్ 37

జనకుని దీవన బలమును
పిన తల్లి ముదాన నిచ్చు ప్రేమామృతమున్
తన ప్రజల శుభా కాంక్షలు
ననుదినమునుబాల గౌత మాభ్యుదయంబుల్ ! 38

కర్షక జనముల మనముల
హర్ష మ్మొదవంగ నేల లారక యెపుడున్
వర్షము కురిసెను ముదమున
శీర్షమ్ముల నెత్తి యాలు చిందులు వైచెన్ 39

బాల గౌతముని ముత్యాల నవ్వులు గాంచి
పువ్వు పువ్వును నవ్వె పొట్టపగుల
శాక్య బాలుని మేని చల్లందనమ్ములో
సస్యలక్ష్మికి మేల్మి చాయ లమరె
సిద్ధార్థు మది దయా శ్రీ లొల్క, ప్రకృతి సం
పద లపారంబుగా వరల సాగె
సర్వార్థ సిద్ధుని చల్లని చూపులో
దిక్కుల నవశోభ తేజరిల్లె

25

ప్రజలు సుఖము లందు బ్రదుకులు పండించు
కొనిరి భయము లెల్ల కోలు పోయి
పుడమి తల్లి గుండె పులకించు నీరాజ
నంబు లెత్తె రాజనంబు లెత్తి । 40

## 3. సంఘర్షణము

ప్రాణి తతుల లోని భయ సంశయంబులు
ప్రకృతి మాత గుండె పగులు రీతి
బాల గౌతమునకు రాలు కన్నీటితో
విశ్వ వీణ మీటి విన్నవించె ! 1

సుజన దుర్జనులపై నిజకాంతి కిరణాలు
ప్రసరించు దిననాథు ప్రతిభ నెంచి,
గుండె నీరై పోయి కుంటపోతగ పోయు
ఘనఘనాఘనమూర్తి ఘనత నెంచి,
అడుగకే పరతెంచి యసువుల నందించు
మలయ మారుత వీచికలను తలఁచి
సృష్ట్యాది నుండి గీచిన గీటు దాటని
సాగరేశ్వరుని దీక్షను దలంచి

మింటి లోని చుక్క కంటిలో వెలుగొందు
"మినుకు మినుకు" భావమును దలంచి
తెలియ రాక యెపుడు తెగిపోని తలఁపుల
కదల లేఁడు బాలగౌతముండు ! 2

పులిమిన కారు చీకటిగముల్ దిగజారఁగ వెండినీట భూ
లలనను స్నాన మార్చి, మృదులం బగు సొమ్ము లలంకరించి తా
వుల నొలికింపఁ జేయఁగల పున్నమ చంద్రుని మోము లోని మ
చ్చలు గని చింతఁజేయు నల శాక్యకుమారుఁడు చిత్తమందునన్ 3

కిలకిల నవ్వు బాలకుల కెంపుల చెక్కిలి పైని శోకపుం
గుళికలు బాష్పబిందువులు కూడికొనన్, మదిలోన మూగవీ
ణలు పలవించి ఖిన్న వదనంబునఁ జూచుచు గౌతముండు త
జ్జలకణ రాశిలో కలిసి సాగును కన్నుల వెంట ధారగా. 4

ఉదయమున పూచి చిరునవ్వు లొలుకఁ జేసి
చండభానుని కిరణ ప్రసారమునకు
మోము వసివాడి దివసాంత మున నశించు
పూలఁ గని నంత వాపోవు బాలకుండు. 5

ఉత్తేజమునఁ జూచుచున్నతోన్నత హిమ
గిరిరాజు మౌళి నింగిని స్పృశింప,
భావాబ్ధియై పొంగు పదునారు దినముల
పరువంపు రేరాజు పరిమళింప,
పులకించిపోవు పచ్చల తివాచీ వైచి
ధారుణీసతి స్వాగతంబు పలుక,
జాలి జాలిగఁ జూచు నేల రాలిన పూల
బాలలు దుమ్ము లోపల నశింప,

నవ్వు నొక్కసారి నలిగి దుఃఖాబ్ధిలో
మునుఁగు నొక్కసారి మురియు నొకట
నేడ్చు నొక్కచోట నేదియో తలఁచుచు
రాలుకరఁగ శాక్యరాజ సుతుఁడు ! 6

భరియించు తనలోని భావాల భారంబు
భూమాత వోలె నోర్పును వహించి,
నీరౌను ప్రాణులు నిరతంబు దుఃఖసా
గర మందు మునుఁగ సాగరము వోలె,
వికసించు తనలోని విద్యుల్లతలు కోటి
కిరణాలు కాగ భాస్కరుని వోలె,
చల్లఁగా పయనించు పిల్లగాలుల వోలె
నంతరంగంబున హర్ష మొదవ,

శూన్యముగ నుండ నేదియో చూచు చుండ
కనుల నీర్నించి నింగిని కనుచు నుండు
పంచ భూతాలు తానుగా భావ మందు
తల్లడిలుచుండు శాక్య భూధవుని కొడుకు ! 7

కళలు సర్వము కరత లామలకముగను
రూపు దాల్చిన తనదు పుత్రునకు సర్వ
శాస్త్ర ములను నేర్పిం పఁగా సాగె నృపుఁడు
కళల తల్లికి నేర్పు విద్యలును కలవె ! 8

క్షత్రి యోచిత మగు సర్వ విద్యలు నేర్చి
వేదములను వల్లె వేసి నాఁడు
మత విధాన ములను మనన కావించి వై
ద్యమున గౌతమాఖ్యుఁ డారి తేరె ! 9

6

ఆట లాడు వేళ నంతరంగంబున
నలల వోలె సందియములు రేగ
నొంటరిగను నేదియో యోజనము సేయు
గౌతముండు నాటగాంఁద్ర విడిచి. 10

మండు టెండకు మలమల మాడి, ప్రతిగ
చెమ్మటల వర్షముం జిమ్ము సేద్యగాంఁడ్ర
త్యాగ పూరిత మగు జీవితములఁగూర్చి
తలఁచు శాక్యభూజాని నందనుఁడు మదిని ! 11

నాగలి యాయుధమ్మున సనాతన ధర్మ పరాయణుండుగా
సాగును మట్టిపట్టలను సార విహీనము లైన నేలలన్
రేగడి భూమిచేయనయి రేయి బవళ్ళును దుక్కిదున్నగా
సాగునె తాను లేక మనజాతి మనుంగడ లొక్క పూటయున్ ! 12

7

పుడమి తల్లి కంఠమున నూగు నల్లపూ
సల సరాల రీతి సాగు చున్న
చీమలను కనంగ చిత్తాన నేదియో
కలఁచి నట్టు లౌను గౌతమునకు ! 13

8

హయముల నెక్కి రాజసుతు లందరు వేటకు నేగ నా దయా
మయుఁడగు శాక్యభూపతి కుమారుఁడు సాగును విల్లు నమ్ములున్
రయమున దాల్చి ఘోరపు టరణ్యము లోనికి ప్రాణికోటి న
క్షయపథ మొందఁ జేయఁగల శక్తియుతుండు వధింపఁజాలునే ! 14

పగపట్టి పర్వు లెత్తుచు
భుగభుగ శబ్దములు చేయు భుజగము భంగిన్
నిగనిగ సాగెడి "రోహిణి"
యఁగుపడ సర్వార్థ సిద్ధుఁ డానందించున్. 15

హిమగిరి కందరాలఁ బ్రవహించెడి నిర్మలమైన నీరు ని
త్యము తమితీరఁ గ్రోలి కడుపారగ పచ్చిక మేసి హాయిగా
గుములయి చెంగనాల నెటకో పరువెత్తెడి లేడి మూకతో
సమముగ సాగు శాక్యకులచంద్రుని చిత్తము లేడిపిల్లయై ! 16

ఎవ్వరి కేని ద్రోహము నాకింతయు సేయక ప్రాణభీతిచే
నవ్వన మందు పర్వులిడు నట్టి యమాయిక మైన లేళ్ళపై
రివ్వన బాణముల్ విసర లేనిమహా కరుణాంతరంగుఁడై
దవ్వుల నిల్చు నా సుగుణధాముడు శాక్యకుమార చంద్రుఁడున్ 17

నీలాకాశ పథంబునన్ ధవళ కాంతి న్నింపు విద్యున్మహా
గోళంబుల్ తెలిరెక్క లబ్బి యొకచోఁ గూర్చుండ లేకే విహం
గాలై సాగుచు నున్నవా యనఁగ చుక్కల్ తాకి రాయంచలున్
నేలం దాక మటంచు సాగినవి మింటన్ గుంపులై సొంపులై ! 18

ఒకచో నా సుకుమార మూర్తి తనలో నుత్సాహ ముప్పొంగ వే
డుకగా చల్లని పిల్లగాలులకు నీడుం జోడు తానై మహో
త్సుకతన్ నాట్యము సల్పుచున్న నెమలిం జూచున్ కళాకేళి సా
త్త్వికసమ్మోహనమై మహా మధురమై దీపించు గాదే మహిన్ ! 19

ప్రాణము తీయఁగ జాలెడి
ప్రాణులు నివసించు చుంద్రు వసుధా స్థలిపై
ప్రాణము పోయగఁ జాలెడి
ప్రాణియొకం డేనిఁ గలడె భావింపంగన్ ! 20

హంసలఁ గనుఁగొని నంతనె
హింసా కార్యములు తలల నెత్తిన వేమో
హంసల తెల్లం దనమును
హింసారుణ రుధిర మిచ్ఛగించిన దేమో ! 21

"దేవదత్తుం" డనెడి మహోద్రేకి యొకఁడు
మెలఁగు చుండును సిద్ధార్థు మిత్రులందు
వాడి బాణంబు సంధించి వైచె నతఁడు
సొంపు లీనెడి హంసల గుంపుపైని ! 22

గిలగిల తన్నుక లాడుచు
కలహంస మొకండు కన్న గాయంబున రె
క్కలు సాచలేక పడియెను
సలలిత మధుమూర్తి పాదసన్నిధి లోనన్ ! 23

నేలఁ గూలిన పిండి వెన్నెలల హంస
మును సమీపించి యాదరంబున కరాబ్జ
ములను లేవనెత్తుచు మహాత్ముఁడు శిలీము
ఖమును బయటకు వెడలించి కనులనిండ 24

నీరు నింపుచు ధారగాఁ గారు చున్న
రక్తమును మెల్లగా నద్ది ప్రాణ భయము
మాన్పివైచుచు తన నిండు మనసులోన
నెనరు పూనుచు హంసను నిమురసాగె ! 25

ఘనతను పొందినట్టు లతి గర్వముగా భుజ మందునన్ శరా
సనమును తాల్చి గౌతము ప్రశంసలు పొందగఁ జేరవచ్చె హం
సను పడఁగొట్టి వీరుఁడుగ చంకలు కొట్టుచు దేవదత్తుఁడా
తనిఁగని రాజపుత్రకు నెదన్ పెను బాకులు గ్రుచ్చిపట్లుగాన్ ! 26

"నేనే కొట్టితి హంసను
నేనే జయలక్ష్మి నిలుచు నిలయము పుడమిన్
నేనే బహువిధ శర సం
ధానమ్ములు తెలియు దేవ దత్తుఁడను సఖా !" 27

అని విజయో త్సాహంబున
తన కెదుట న్నిలుచు దేవదత్తు నిగర్వం
బును కాంచి హంసరాజం
బును చంకకు నెత్తి గౌతముం డిట్లనియెన్ 28

"ఎక్కడఁ బుట్టెనో మరి యదెక్కడొ గ్రుక్కెఁడు నీరు గ్రోలి యే
యొక్కరికైన కీడు తన యుల్లము నం దలపోయ కుండ నీ
దిక్కున సాగు హంసను వధింపఁ దలంచిన ఘాతుకుండ వై
నిక్కెదవేల? ప్రాణములు నీకును తీపియె కాదె మిత్రమా !" 29

అని యువరాజు పల్కి హృదయంబున తీవ్ర పరాభవాగ్ని గు
ప్పున రగులంగ నల్లబడి పోయిన మోమున దేవదత్తుఁ డి
మ్మనె తను కొట్టినట్టి కలహంసను! వాని వికార రూపమున్
గనుఁగొని హంస తల్లి తెలికన్నుల బాష్ప జలంబు లూరఁగాన్! 30

ప్రాణము నిలిపెడి వాఁడా
ప్రాణికి నధికారి యనగఁ బరగును గానీ
ప్రాణాపహరుల కిమ్మహి
ప్రాణులపై హక్కు లెట్లు వచ్చును తలఁపన్?" 31

అని పల్కి హంస చెల్లిని
తన భుజమున నెత్తికొంచు దయగల యువరా
జును హయము నెక్కి చనియెను
తనయుని గని తండ్రి కడు ముదంబునఁ దేలన్ ! 32

అమ్మరాళ ఖగము నత్యాదరంబున
కనుల లోనఁ బెంచి గౌతముండు
గాయ మెల్ల మాన్పి గగనాన విడిచె,న
య్యది యహింస చిహ్నమై వెలుంగ ! 33

కాలము గడిచిన కొలది వి
శాలము కాఁజొచ్చి హృదయ సామ్రాజ్యము, భూ
పాల కుమారుఁడు చూచు మ
రాళము చనినట్టి నీలి రంగుల నింగిన్ ! 34

కంపించి పోవు! రెక్కలు రాని కూనల
కలుకు కత్తుల కుత్తుకలను నఱుక !
కన్నీరు నించు! నంగము లెల్ల పుండుగా
కుందెడి కుష్ఠ రోగులను కాంచి !
నిట్టూర్పు విడుచు ! తండ్రికి దూరమై పోయి
పలవించు లేఁత పాపలను జూచి !
నిలువున నీరౌను ! నిరతంబు పొలములో
చెమ్మటల్ చిందు కృషికులఁ గాంచి !

బారులుగ దీరి గగన సంచారు లగుచు
సాగు చుండిన రాజ హంసలను కాంచి
ఎచటికో గమ్య మని నిర్ణయింప లేక
తలఁపులను నిండు రాజ పుత్రకుని మనసు ! 35

ముదిమి మహా పిశాచి కరముల్ బిగియింపగ నల్గి పోయి యా
పదలకు తావలంబయి, జపంబులు జారఁగ నూఁతకఱ్ఱ పై
కదలు శవంబు మాడ్కి తన కట్టెదుట న్నడయాడు నొక్క పె
మ్మదుసలివానిఁజూచి తలపుల్ యువరాజును తొందరించెడున్! 36

## 35

గౌతముని లోని భావ సంఘర్ష ణంబు
రాజు హృదయాన గాయమై రగుల తాను
రాజ్య రమతోడ జీవిత రాజ్య రమను
కట్టఁ బెట్టఁగ తలపెట్టె గౌతమునకు !

## 4, జ్యోతిరవతరణము

కళకు శాస్త్రిమ్మునకు జత కలిసి నట్లు
కుసుమమునకు తావికి పొత్తు కుదిరినట్లు
మోహనాంగుఁడు యువ గౌతమునకుఁ బెండ్లి
జరిగె వైభవంబుగ "యశోధర"సతిగను. 1

దరహాస యగు యశోధర ముఖాంబుజమున
శ్లోక తప్తుల మోము చూచు చుండు,
కాటుక సొగసుల కన్నుం గవను, నంధ
కారపు బ్రదుకులఁ గాంచు చుండు,
గల గల మను కర కంకణ ధ్వనులలో
విలవిల లేవియో వినుచు నుండు,
కాలి యందియల ఘల్ ఘలలందు తుదిలేని
గమనంబు లేవియో కనుచు నుండు,

ప్రణయ మధు రాతిమధుర యామినుల యందు
నులికి పడి లేచి యొంటిగా నొక్కసారి
కరి మొరల్ విని సాగు నక్కమలగర్భుఁ
డనఁగ సిద్ధార్థుఁ డవ్వలి కరుగు చుండు ! 2

చిత్ర మైనట్టి పతిదేవు చేష్టచూచి
నొచ్చుకొనక యశోధర నోము పంట
యని తలంచుచు పతి సేవలను సతమ్ము
చేయు చుండును పతి నెడబాయ కుండ. 3

రాజ్యము వీరభోజ్యమని రంకెలు వేయు మదాంధకార భూ
రాజ్య రమా మనోహరుల రాతి రథంబుల క్రింద ముక్కలై
రాజ్యము నిల్పు సైనికుల రక్తఝురిన్ మధురాన్న రాశిలో
నాజ్యముగా భుజించు కలహప్రియులం గని గుండె నీరుగా ! 4

కరఁగి పోవుచు యువరాజు గౌతముండు
బహు విశాల సంపన్న భావములతోడ
రాచ కార్యంబు లందు నిరంత రంబు
సతమతం బగు తండ్రికి సాయ పడును ! 5

తనయుఁడు చూపుచున్న సమతా విలస న్నవ మార్గముల్ మహో
ర్విని తులలేని స్వర్గ మొనరింపఁగ జాలు నటన్న నమ్మకం
బున కడు తృప్తుఁడై పువులు మూడును కాయలు నారు కాగ ప
చ్చని యువరాజు జీవిత వసంతము చూడగ నెంచె తండ్రియున్.

సృష్టిసమస్తమున్ కదలి చేతులు సాచుచు దుఃఖ వార్నిధిన్
నష్టము పొందనీక, మరణం బను ఘోర పిశాచి కోరలన్
కష్టము కల్గనీక చిరకాలము సౌఖ్య పథంబు లోన నో
స్రష్ట! మనంగఁజాలు నొక చక్కని మార్గము చూపు మన్నటుల్ !

వినతి యొనర్చి నట్లు పృథివీపతి నందనుఁ డాత్మ లోన నెం
చును ! ప్రతి ప్రాణి దీనముగ చూచిన చూపు విషాద గాథలన్
వినిచిన యట్లుగా కనులు విప్పి పదింబది చూచు ! దుఃఖ భా
జన మగు ప్రాణి కోటికి ప్రశాంతత గూర్పగ నిశ్చితాత్ముడై ! 8

అంతం బన్న దెఱుంగ నట్టి భువిలో నత్యంత సంతోషులై
చింతా క్రాంతులునై దరిద్రులుగనై, శ్రీమంతులై భోగులై
కాంతా లింగన దాసులై తుదకు రోగ ప్రాప్తులై దేహమన్
బొంత నీడ్చుచు నెందుఁబోయెదరొ నిప్పుల్ గ్రక్కు కాష్ఠంబునన్.

ధరణీ చక్రము నందు ప్రాణు లిటు ఖేదం బొంది సంసార దు
స్తర శోకాంబుధి నీదలేక నడి సంద్రం బందునన్ మున్గుచున్
మరణం బొందుట కేమి కారణము? కామ క్రోధ లోభాదు లి
న్నరజాతిన్ విడనాడ బోవ కట నెన్నాళ్ళీ మహా ఘోరముల్! 10

అనుచు చింతా సముద్రంబునందు మున్గి
దారి దరిలేని నౌకా విహారి వోలె
బిట్టు నిట్టూర్చు సిద్ధార్థు తట్టి పత్ని
వలపుపలుకుల తీయగాఁ బలుకరించు. 11

సంసార జలధిలో సాగు చుండినను గౌ
తముఁడు దానిని దాటఁ దలఁచు చుండు
ముదమిడు రుచి రాన్నములు భుజించుచు, క్షుధా
నల తప్త మాన మూర్తులను కనును,

విలువైన పట్టు వల్వలు కట్టికొనినను
　　　జీర్ణాఁబరులనె వీక్షించు చుండు,
రమణీయ శర్మ హర్మ్యము లందు నున్నను
　　　పూరి పాకలఁ దేరిపారఁ జూచు,

రాజ్య మునకు కాఁబోయెడి రాజు తాను
తనదిగా నేది లేనెలే దని తలంచు
విశ్వ కల్యాణ మొనరించు విమల యశుఁడు
భోగ భాగ్యంబు లను ప్రొద్దు పుచ్చఁగలఁడె ! 　　　12

కాల చక్రంబు గిరగిర కదలి సాగె
ధన్యురాలు యశోధర తపము పండి
కనెను పుత్రుని జాబిల్లి కళల వాని
తండ్రి, తాతయు మిగుల సంతసము పొంద. 　　　13

తనయుఁడు తండ్రియై తనను తాతగఁ జేసె నటంచు, రాజునై
ఘన యశమున్ గడించి, చిరకాలము భూవలయంబు నేలు నం
చును పులకాంకురాలు పొడసూపిన దేహముతోడ శాక్యరా
జును ముదమందినాఁడు సుతుఁజూచుచు మన్మని మోముచూచుచున్.

తనవంశము నిలిపెడి మ
న్మనికిని రాహులుఁ డటన్న నామము శుద్ధో
దన భూమీశుఁడె పెట్టెను
ఘనుఁడవు నీవనుచు బహు ముఖంబుల పొగడెన్. 　　　15

అనిశము దుఃఖసాగరము నందు తపించెడి ప్రాణికోటి జీ
వనమున కాంతిరేఖ చిరవాసము చేసెడి మార్గ మెట్టిదో
యని యువరాజు మానసము నందు తపించుచు, నట్టి మేటి దా
రిని వెదకంగ సాగె పలు రీతుల యోజన చేసి చేసియున్. 16

చిన్న జీవిని తిను పెద్ద జీవి యొకటి
పెద్ద జీవిని తిను కడు పెద్ద జీవి
జగతి నొక్కరి నొకరిట్లు చంపు కొనుట
మరచి, సుఖ జీవనము సేయు మార్గ మెద్ది ? 17

హింస లీరీతి సాగిన నిమ్మహి నిఁక
నిలుచు నదిలేదు శోక వార్ని ధులు దక్క
కాల గర్భాన జీవులు కలసి పోయి
చేయునది లేదు రాఁబోవు జీవ తతికి ! 18

దుఃఖ మను పిశాచిని పోవఁద్రోలు వఱకు
శాంతి దేవత నిలువ దీజగతి లోన
శాంతి దేవత లేకున్న శాశ్వతముగ
నంధ కారమే పుడమిపై నావరించు ! 19

అంధ కారాన దారి తె న్నరయ లేని
వాఁడు ప్రాణంబు లున్న శవంబు కాదె
పుట్టువేల భూమిని శవములుగ మారి
చిమ్మ చీఁకటి లోన నశించు కొఱకె ? " 20

అని నిత్యము సిద్ధార్థుఁడు
మనమునఁ దలపోయు నెట్టి మార్గము తనకున్
గనరాక క్రిందు మీదగు
పనవి పనవి యొకట దుఃఖపడు నొంటరిగా. 21

దినమెల్లం బయనింట భూమిపయి కాంతిశ్రీలు వెల్గించి న
ల్గిన యంగంబునఁ బశ్చిమాంబునిధిలోఁ గ్రీడింప సూర్యుండు నే
గెను, క్రొంజీఁకటి భూ నభంబులను తాఁకెన్ దీపకాంతుల్ పురం
బును వెల్గించుచు నుండె, చీఁకటుల రూపుల్ మాపఁ బోరాడుచున్. 22

ముద్దుల బిడ్డ రాహులుని మోమున వెల్గెడి లేఁత కాంతు లే
ప్రొద్దు యశోధరాసతికి పున్నమ వెన్నల చూపు, ప్రేమతో
నిద్దుర పుచ్చి పుత్రకుని నీమము చొప్పున భర్త పాదముల్
అద్దుకొనెన్ కనుంగవకు, నంతట నాసతి కున్కె నిద్దురన్ ! 23

పాపభరంబు మోయుట నపార బలోద్ధతి సన్నగిల్లి "యీ
పాపపు భారమున్ వడిగఁ బాపు" మటంచును భూమితల్లి వి
జ్ఞాపన సేయఁగా కమల నాథుఁడు లేచిన యట్లు గౌతముం
డూపున మేలు కాంచె నెవరో వెను దట్టుచు లేపి నట్లుగాన్. 24

మచ్చలు లేని చంద్రుఁ డన మాయని తీయని ప్రేమ మాధురీ
స్వచ్ఛతఁ జూపు ప్రాణసతి చక్కని మోమును కాంచి ప్రక్కలో
నచ్చ మమాయికంపు హృదయ ప్రతిబింబమునైన రాహులున్
పొచ్చెము లేని ప్రేమఁ గని, పూజ్యుల తల్లిని తండ్రినిం గనెన్.

ఒక్కొక్క మెట్టు వెచ్చనగు నూర్పులతో దిగుచుండె గౌతముం
డొక్కొక పాశబంధనము నోపికతో తెగఁ గోసికొంచు, తా
నెక్కడి కేగ నెంచెనొ మహీ వలయంబున శాంతి నిల్పనై
చక్కని బిడ్డనున్, సతిని, జన్మ మొసంగిన వారిఁ బాయుచున్. ౨౬

తనువుం బంచి యొసంగుభార్యను స్వరక్తం బందు రూపంబు తా
ల్చిన గారాల వరాల బిడ్డను కళాశ్రీ వెల్గు సామ్రాజ్యమున్
జననం బిచ్చిన వారలన్, జగతి రక్షాకంకణుండై త్యజిం
చిన సిద్ధార్థుఁడు భారతావనికి సుశ్రేయంబు లందించెడిన్. 27

ఆగతి నంధకార మయమైన పథంబున సాగుచున్న ది
వ్యాగమ రూపునిం గనుటకై తెలివెన్నెల కన్ను విప్పుచున్
సాగెను చందురుండు తన చల్లఁ దనంబును చూపుకోసమై
మూగెను పిల్ల తెమ్మెరలు పువ్వులు చిమ్మెను కమ్మతావులన్. 28

అజ్ఞాన తమము పాపుచ
విజ్ఞాన జ్యోతి భువిని వెల్గించుటకై
జిజ్ఞాస నేగు విభుని కృ
తజ్ఞతతోఁ జూచుచుండె తరుశాఖ లహో ! 29

ధన కనక వస్తు చయమును
జననీ జనకులను విపుల సామ్రాజ్యంబున్
తృణముగ త్యజించి వచ్చెడి
ఘనునిం గన లేడిపిల్ల కన్నులు విప్పెన్. 30

పాదచారు( డగుచు వనముల( దిరుగాడు
శాక్యకుల మహాబ్ధి చంద్రు నరసి
గుండె ఝల్లుమన(గ గ్రుంకెను చంద్రుండు
దినకరుండు తూర్పు దిశను వెలి(గె. 31

సింహపీఠి నధివసించి ప్రజల నేలు
రాచబిడ్డ( డొక్క రావిచెట్టు
మూలతలమె మణులు పొదిగిన పీఠిగా(
జేరి దీక్ష తపము చేయ సాగె. 32

రోజులు వారముల్ నెలలు రూపటి పోయెను వత్సరాలు నీ
రాజన మిచ్చి కాల కుహరంబున డాగెను, ధారుణిన్ మహా
రాజుగ కీర్తి సంపదల రాజిల( గల్గు ఘనుం డిటుల్ పరి
వ్రాజకమూర్తి యౌచు వనవాసిగ మారెను మౌనముద్రతో ; 33

నవ వసంతము లెన్ని నర్తించి పూలను
సిద్ధార్థు శిరమున( జిమ్మి చనియె ?
గ్రీష్మమ్ము లెన్ని శిరీషకుసుమ సుకు
మారుని యొడలెల్ల మండ( జేసె ?
వర్ష ఋతువు లెన్ని బానల నీరంబు
కోమలాంగుని పైని గ్రుమ్మరించె ?
శరదిందు చంద్రికల్ శాక్య చంద్రునిపైని
నెన్నిమారులు ప్రసరించి యేగె ?

ఎంత మంచును చల్లె హేమంతు ఋతువు ?
చెట్ల యాకెంత రాల్చె నాశిశిరఋతువు ?
ఆరు ఋతువుల చక్రమే యరుగుఁ గాని
తపము విరమింపఁ డాయె గౌతమ విభుండు ? 34

పుడమి నలమిన చీకటి పొరల నెల్లఁ
బారఁద్రోలఁగ నుదయాద్రి పైని భానుఁ
డుదయ మొందెమ, నవ నవాభ్యుదయ పథము
చిత్తమున గోచరింప లేఁచెను తపస్వి. 35

బోధివృక్ష మయ్యె భువి రావిచెట్టును
బుద్ధమౌని సిద్ధి పొందు కతన
పుట్టి పెరిగి నట్టి పుణ్యంబు భారత
మాత కబ్బి మిగుల ఖ్యాతి వచ్చె ! 36

దినకరు దీప్తులు వదనం
బున నాట్యము చేయ, తమము పోనాడఁగ జా
లిన పసిఁడి పల్కులను నా
ఘనుఁడగుముని మౌళి కాలుకదిపెన్ పుడమిన్. 37

మణిమయ మకుట శోభను వెల్గఁగల శిరం
బున నీలి ముంగురుల్ ముడులు వైచి,
రాజసంబున ఠీవి రాజిల్లు మోమున
బ్రహ్మ తేజంబును పదిల పరిచి,

పట్టు పీతాంబరాల్ కట్టఁ జాలిన మేన
కాషాయములను చక్కఁగ ధరించి,
ముత్యాల హారాలు పొలుపొందు మెడను రు
ద్రాక్ష మాలికలు ముదానఁ దాల్చి,

34

కలుష జలనిధి దాటింపఁ గలుగు నట్టి
నావనా నొప్పు విరియు జ్ఞానంబు తోడ
నమృత మొలికించు మధుర వాక్యముల తోడ
బుద్ధముని మౌళి ప్రజలకు బోధ చేసె. 38

35

నిలువఁడు మానవుండు ధరణీతల మందున నెల్లకాలమున్
నిలిచిన మూఁడునాళ్ళు లతి నిర్మల మార్గమునందు నీతిగా
మెలఁగవలెన్ ధనాఢ్యులు నమేయ పరాక్రమ శాలులైన ని
ప్పులఁబడి కాలి బూడిదయి పోవుట తప్పునె మానవాళికిన్ ? 39

36

నిన్నుఁ బోలి భూమి నున్నట్టి జీవులఁ
జూచి నపుడె కలుగు సుఖము లెల్ల
ప్రాణ మున్న యట్టి ప్రతిజీవిలో దైవ
మును గనుటయె స్వర్గమును సుఖంబు !

37

హింస చేయకూడ దెవ్వరి కైనను
విఱ్ఱ వీగరాదు వెఱ్ఱిగాను
నీటి బుడగవోలె నిమిషాన మాయమౌ
బ్రదుకు పైని పిచ్చి భ్రాంతి వలదు.

మనసులోన నున్న మత్సరం బంతయు
పోవఁ ద్రోలలేక పొరుగు వారిఁ
దూలనాడ తగదు దుఃఖహేతువు లైన
కామ మోహములను కాల్ప వలయు. 42

కోప మనునది శత్రువు కువలయాన
శాంతి కాముకులకు మనశ్శాంతి కలుగు
శాంతి కలిగిన మన సదే స్వర్గసీమ
యగును, దానికి కృషిసల్పుఁ డనవరతము. 43

కలిమి బలిమి కలిగి కారు చీకట్లలో
గంతు లిడిన ఫలము కలుగఁబోదు
భూత దయ యహింస పూతభావము కల్గి
నిర్మలత్వ మందు నిలువ వలయు. 44

ఓర్పు సత్యము దయ లవి యున్ననాడె
భూతలము నందు స్వర్గంబు పుట్టఁగలదు
కోప తమ మెల్లఁ బాపుచు కూర్మి యనెడు
దివ్వె వెలిగింప బ్రదుకులు తేజరిల్లు. 45

అరిషడ్వర్గంబులు భీ
కరమౌ శత్రువులు వాని కౌఁగిటి లోనన్
నిరతము మ్రగ్గక, యిల సు
స్థిరులై జయమొంద స్వర్గసీమ లభించున్. 46

సమత మమత కోరి సత్యంబు పలికిన
దుఃఖ మను పిశాచి దూర మగును
కొట్టి గొప్ప యనెడి కొట్టి బుద్ధిని వీడి
బ్రదుకుమన్న నదియె పరమ పథము. 47

దుర్వ్యసన చయమ్ము దుష్టబుద్ధుల నెల్ల
విడనాడుము నపుడె విశ్వశాంతి,
కలుగు నంచు బోధగావించె మునిరాజు
శిష్యకోటి తన్ను చేరి కొలువ. 48

కన్నుల నీరు నించి బిగఁగట్టిన కాళ్ళను విప్పుకొంటకై
తన్నుకలాడుచున్ మనుజ ధర్మము హేయ మటంచు నేడ్చి, యా
పన్న శరణ్యు డప్పటిటు వచ్చి ఘటంబును చూచు మేకకున్
కన్నుల నిల్పె రక్షకుని కైవడి శాక్య కులావతంసుఁడున్. 49

మన్ననతోఁ జని మేకను
నన్నన గదియించి, కనులయందలి నీరున్
చక్కఁగ తుడుచుచు నున్నని
చెక్కిలి నిమురంగ సాగె సిద్ధార్థుండున్. 50

ప్రాణ మన్నది తీపి యే ప్రాణికైన
పాప పరిహార మగునంచు ప్రాణి తతులఁ
జంపఁ జూచుటె పాపంబు సకల ప్రాణు
లను తనను పోలె ప్రేమతో కనఁగ వలయు. 51

నీదీ నా దను మాయలో మిగుల భ్రాంతిం జెంది దుఃఖాబ్ధిలో
పాదంబుల్ వడి మోపి నిల్చిన సుఖప్రాప్తంబు ముమ్మాటికిన్
రా దెవ్వారికి కీడు సేయక మహారణ్యాల లేఁబచ్చికల్
వాదం బెంచక మేయు జంతువులఁ జంపం జూచు మర్త్యాళికిన్. 52

సంతోషంబె మహౌషధంబు మదికిన్ జాడ్యంబు బోకార్పఁగా
శాంతి న్మించిన మేటి యాయుధ మిలా చక్రంబునన్ లేదు శ్రీ
మంతుల్ పేద లటన్న భావము తలంపన్ చేటు, కారుణ్యమే
స్వాంతం బందున నిల్పునా డదియెపో స్వర్గంబు వేయేటికిన్! 53

అని పల్కి మేకచెల్లినిఁ
గని, బుద్ధుఁడు కట్లువిప్పి కారుణ్యంబున్
తనువెల్ల నింపి పంపెను
ఘనమగు హర్షంబు మేక కన్నుల వెలుఁగన్. 54

# 5. సందర్శనము

శ్రీగల రాజ్యంబును, సుఖ
భోగంబులు వీడినట్టి బుద్ధుఁడు పురికిన్
రాఁగలవాఁడని వార్తలు
మ్రోగె నహా కపిల వస్తు పుర వీథులలో. 1

రాజకుమారుఁ డంట, మునిరాజుగ మారి ప్రసన్న మూర్తిగా
తేజము లొల్కునంట, నతి దీనులు, రాజులు సర్వసృష్టి నీ
రాజన మిత్తురంట, మధురంబగు వాక్కుల తాత్త్వికార్థమున్
రోజును తెల్పునంట, కనరో మన ప్రోలున కాలుమోపఁగా ! 2

కత్తిని పట్టి శత్రువుల కంఠములం దునుమాడు వాఁడు నా
కత్తి కసాధ్యమైన యధికారము శక్తిని పొందెనంట నో
రెత్తిన చాలు జల్లులుగ నిమ్మహి తేనియ లొల్కునంట, ఆ
సత్తెము చూచి తీరవలె సర్వము గెల్చిన వానియందునన్. 3

క్రూర మృగాలమధ్య నతి ఘోరముగా తప మాచరించి, సం
సారులు పొందు దుఃఖమును సాంతముగాఁ బెకలించు మార్గమున్
ధీరతఁ జూపునంట, తన తేజముచే భువినెల్ల చీఁకటిన్
పారఁగఁ ద్రోలునంట, నిటువచ్చు నటే మన నోము పంటగా! 4

మణిపీఠమును వీడి వనములం దిరుగాడి
యొంటిగా నెట్లు కూర్చుండె నొక్కొ
మౌళిని ఘన రాజమకుటంబు పోనాడి
జడల నెవ్విధి తాను ముడిచె నొక్కొ !
జలతారు పట్టు వల్వలు కట్టు మేనికి
కాషాయముల నెట్లు కట్టె నొక్కొ !
కరవాలమును పూను కరమందు తానెట్లు
ముని రాజ దండంబు పూనె నొక్కొ !

భోగ భాగ్యంబు లెడబాసి మునుల లోన
కలిసి పోయి జీవిత మెట్లు గడిపె నొక్కొ
తలఁచి చూచిన నంద దెంతకును మదికి
చూచి తీరఁగా వలె వాని సొబగు లెల్ల. 5

పోయిన వస్తువున్ తిరిగి పొందిన రీతిగ రాజు గుండెలో
తీయని హాయి నింపి ననతేనెల సోనలు జాలువార్చునో
పోయిన బాధనే మరల పొందిన రీతిగ రాజుగుండెనే
గాయము చేసి, పుంటిపయి కారము చల్లిన యట్లు మార్చునో. 6

పతిదేవుని గని సతి దుః
ఖితమతియై యరుగుదెంచి కేల్మోడ్చునొ ! భ
క్తతతిని విడనాడుచు జీ
వితమును పండించు మంచు వేడఁగ చనునో ! 7

తండ్రిఁ గనుఁగొని పాద పద్మములు తాకి
భక్తి మ్రొక్కునో చిన్నారి పట్టి ? లేక
కోప ఘూర్ణిత ముఖుఁ డౌచు కుమిలి కుమిలి
పోవునో తన నెడబాసి పోవు కతన. 8

అనుచును సిద్ధార్థుని రా
కను విని యోజనము సేయ కడఁగిరి, రాజే
మునియౌటఁ జూడవలె నని
యనిశము తలపోయుచుండి రప్పురవాసుల్. 9

మంగళ వాద్యముల్ నిరుపమాన గుణాఢ్యుని కీర్తియో యనన్
నింగిని తాకి వచ్చి రమణీ కరకంకణ నిక్వణంబుతో
5 సంగమ మౌచు వీనుల పసందగు విందును కూర్చుచుండగా
మంగళ తోరణంబులు క్రమంబుగ కట్టిరి వీథి వీథికిన్. 10

ఘన సింహాసన మెక్కి శత్రువుల సంగ్రామంబునం గెల్చి కీ
ర్తిని చేపట్టి మహోన్నతుం డగుచు దీప్తి న్నింపు వాఁ డీగతిన్
నో. 6 మునియై వచ్చుచునుండ, స్వాగతముగా ముంగిళ్ళ ముత్యాల ము
గ్గును చిత్రించిరి భామినుల్ నవ కళాగోళంబులా యన్నటుల్. 11

శ్రీ కల్యాణ గుణాభి రాముఁడయి ధాత్రీచక్ర మందున్న పెన్
శోకం బన్న పిశాచి పన్నుగడ లుచ్చుల్ త్రుంప నేతెంచు నా
7 సాకారంబగు శాంతి దేవతకు పూజల్ చేయ నుత్సాహులై
మూకల్ మూకలు వచ్చినారు ప్రజ సమ్మోదంబుతో ప్రోలికిన్. 12

వచ్చుచునుండె బుద్ధ భగవానుఁ డటంచును తీయ తీయగా
వచ్చెను వార్త మేలగు సువాసన పోలిక నత్తరిన్ పురిన్
ముచ్చట లాడువారు "నిదె పోవునదే మునిమౌళి" యంచు వా
క్రుచ్చెడివారు, "పోవు దెటకో" యని ప్రశ్నలు వేయువారునై 13

ఇసుక వేసిన నది రాలనీయకుండ
నేలయీనిన విధముగా నిలిచి ప్రజలు
వేచియుండిరి బుద్ధుని చూచుకొఱకు
రాజమార్గంబునకు నిరు ప్రక్కలందు. 14

శిష్య పరివేష్టితుం డౌచుఁ జేరవచ్చె
బుద్ధ ముని రాజమౌళి యప్పురము నంత
మొలక తెమ్మెర, జనుల చూపులను కలిసి
మౌనివరు దేహమును స్నాన మార్చి నిలిచె ! 15

"ఆతఁడే నంట మాయాదేవి కమ్మని
కలగని కడుపార కన్న బిడ్డ !
ఆతఁడే నంట మ మ్మనిశంబు పాలించు
ననుకొన్న శుద్ధోదనుని సుతుండు !
ఆతఁడే నంట రాజ్యమును తృణంబుగా
త్యజియించి చనినట్టి త్యాగధనుఁడు
ఆతఁడే నంట తీయని యమృతపు పలుక్క-
లను తాత్త్వికార్థంబు వినుచువాఁడు

ఆతఁడే దుఃఖభూయిష్ఠమైన బ్రదుకు
లను వసంతము నింపఁ జాలిన ఘనుండు
ఆతఁడే ! యాతఁడే ! యరణ్యముల తపము
సలిపి సిద్ధిని పొందిన శాక్య విభుఁడు !" 16

అనుకొనుచు, వచ్చు గౌతమ మునిని గాంచి
నోము పంటగా నెంచి దీనులుగ నిలిచి
చూచుచుండిరి ప్రజలెల్ల చోద్యముగను
హృదయముల భక్తిభావంబు లుదయమొంద. 17

తాను మునుపు చరించిన తావులెల్లఁ
గనుచు, బోధి సత్వుఁడు వేగ చనుచునుండె
కక్షపాలను పూని లోకముల దుఃఖ
ములను పాపఁగఁ జను మూలపురుషుఁ డనఁగ. 18

రాజదండంబు పూను కరంబునందు
కక్షపాలను గైకొని కదలివచ్చు
త్యాగధనుని కనినంత హృదంతరాలు
కరఁగి కన్నుల ధారలై యురలె ప్రజకు. 19

కరములు మోడ్చువారు, తమ కన్నుల బాష్పము లొల్కువారు, ఘో
కర దురితంబునుండి మము కావు మటంచును వేడువారు, సుం
దరమగు శాక్య మౌని వదనంబును కాంచి తరించి భక్తితో
పరవశులైరి పో కపిలవస్తు పురంబునఁ బౌరు లెల్లరున్ ! 20

ధనికుఁడు, పేదయు, ముదుసలి
యును, తరుణ వయస్కుఁ డున్నతోద్యోగియు, వా
రును వీరు నంచుఁ దలఁపక
కనుఁగొన నరుదెంచి రంత గౌతమ మౌనిన్ ! 21

కానక కన్న కుమారుని
జ్ఞాన ధనముతోడ వచ్చు సంతానంబున్
పూనిక కనుఁగొననై భూ
జానియు నరుదెంచె బాష్పజల లోచనుఁడై. 22

త్రాడు తెగి రాలునట్టి ముత్యాల వోలె
కన్నుఁ గవనుండి నవ బాష్ప కణము లురల
చెదరి ముంగురుల్ మోముపై చిందులాడ
న య్యశోధర సుతునితో నరుగుదెంచె ! 23

జననం బిచ్చియు పెంచి యైహికముతో స్వర్గంబు సాధింపఁ జా
లిన విజ్ఞానము పంచిపెట్టి, మనుజాళిన్ నీతి మార్గంబులో
ననిశంబు న్నడిపించుచుండి నిజ రాజ్యంబెల్ల నర్పించి ని
ల్చిన ప్రేమాంబుధి తండ్రి మోముగనియెన్ సిద్ధార్థుఁడా ప్రక్కగన్.

తన దేహంబును, ప్రాణమున్ సకల సౌందర్యంబులన్ ప్రాణ నా
థున కర్పించి, యమూల్య రత్నమగు పుత్రున్ కాంచి, సద్ధర్మ చా
రిణియై గీము నలంకరించి, తనవారిన్ బాసి ప్రాణేశ్వరున్
గననై నిల్చిన ధర్మపత్ని యకలంకంబైన మోమున్ గనెన్. 25

తన ప్రతిబింబం బన దా
పున నిల్చిన ముద్దుపట్టి మోమును కనుచున్
మన మందు చింత నొందఁడు
తనయులె ప్రజ లెల్ల రంచు తపసి తలంచున్. 26

ప్రక్క నున్నవారి పల్కరించిన రీతి
బంధు జనుల నెల్లఁ బల్కరించు
దర్శనంబు కోరి తపియించువారలఁ
గనిన రీతి జనకుఁ గనుచు మౌని 27

నా పుత్రుఁడు, నా జనకుఁడు
నా పతి, నా సతి యటంచు నానావిధ సం
తాపంబులందు మునుఁగుట
యే పరమార్థమును మరచు టిద్ధర నెపుడున్. 28

ఆఁకలిమంట దేహమును కాల్పఁగ నల్ల
పడిపోయె నొక యస్థిపంజరంబు,
ముదిమి గుప్పిటిలోన నొదిగి బిత్తరపోయి
మూడు కాళ్ళను నిల్చె ముసలి యొకఁడు
కుష్ఠరోగపు వాడి కోరల నొడ లెల్ల
పచ్చిపుండైన నిర్భాగ్యుఁ డొకఁడు
ఆప్తులు లేక తా నంతులేనట్టి దుః
ఖాబ్ధి మున్గిన నిస్సహాయుఁ డొకఁడు,

వలపు లందింటు లావణ్యవతిని పాసి
పలువరించుచుఁ దిరుగు యౌవనుఁ డొకండు
బాధ లీ రీతి ధరణిలో వరలుచుండ
సౌఖ్య మెక్కడి దింక భూ చక్రమందు ! 29

పుడమి నున్నట్టి ధన ధాన్యములును మాయ
నాది నీ దను పెద్ద వాదనలు మాయ
సత్య నిరతియు నిష్కల్మషతయు కలిగి
నరులు జీవింప దొరుకు నానందసీమ ! 30

బుడగలవోలె మాయమయి పోవును జీవితముల్, సతమ్ము నె
వ్వఁడు ధరణీతలాన తలపన్ నివసింపఁడు, శాంతచిత్తులై
యుడుగుఁడు దుష్టవాంఛలు, మహోన్నతమౌ సుర రాజ్య సీమలో
నడుగిడు మార్గ మిప్పుడమియందున నన్యము తోప దెన్నగా. 31

క్షణ భంగురమగు దేహం
బును కామింపంగ నేల మోహాంధతచే
ఘనమైన పుణ్య లోకం
బును చేరఁగ రండు గ్రుడ్డి మోహము విడుచున్ !

పలుకంగవలె సత్య వాక్యంబు లేనాడు
నన్సృత మన్నది విడనాడవలయు !
సలుపంగవలె నెట్టి సన్న జీవులనైన
హాని చేయగఁ జాలనట్టి పనులు !

చరియింపవలె ధర్మనిరతి గల్గిన మంచి
మార్గంబులందు సమ్మతము చూపి
తలఁదాల్పవలె నిరంతరమును విశ్వ క
ల్యాణంబె ముఖ్యమైనట్టి దీక్ష

సంచరింపుఁడు నిరతంబు సమతతోడ
మసలుకొనుఁ డెప్డు తీయని మమతతోడ
దయను చూపుఁడు సకల భూతముల యందు
సత్యమిద్దియే నమ్ముఁడో సదయులార! 33

సత్యం బహింస జీవుల
కత్యంత ప్రధానమైనవై విలసిల్లున్
సత్యవ్రతులై హింసను
నిత్యము విడనాడ శాంతినిలయము వెలయున్. 34

గ్రుక్కెఁడు గంజికై కుమిలిపోయెడి వారి
యాఁకటి చిచ్చు చల్లార్పవలయు,
ధరియింప నొక్క వస్త్రము లేక సిగ్గిల్లు
దీనుల యగచాట్లు తీర్పవలయు,
నివసించుటకు నెట్టి నిలయంబు కనరాక
కుందువారల నాదుకొనఁగ వలయు,
నాదరించుటకు 'నా' యను వారు లేని రో
గులఁ జేరి సాయంబు కూర్పవలయు,

తల్లిదండ్రులు లేక యాదరము లేక
తల్లడిలు బిడ్డలను మహాదరముతోడ
చెంతఁ జేర్చిన పుడమిని చిక్కులెల్ల
తొలఁగి నవ వసంతంబులు తొలకరించు. 35

జీవుల హింసించుట యన
జీవంబిడు ప్రభుని హింస చేయుటె కాదే
జీవులఁ బ్రేమించిన సుఖ
జీవనము ఘటిల్లు నెల్ల చింతలు పాయున్ । 36

అని శౌద్ధోదని పలికిన
వినుచుండిరి జనులు మిగుల వినయముతోడన్
కనువిందు చేయు బుద్ధుని
కనుచుండిరి రెప్పలేని కన్నుంగవతో. 37

తనయుని కౌఁగిలించుకొని తాపము తీరఁగ బాధలెల్లఁ జె
ప్పి, నయమునన్ స్వరాజ్యమును వేడుక సేయుచు నేలుకొమ్మటం
చును తెలుపంగఁ బోయి సుతుఁ జూచుచు బోధలు వించు పూజ్య భా
వనయుదయింప తా నిటులు పల్కెను భూధవుఁ డబ్బురంబుగన్.

"కానక కన్న యట్టి మమకారమున న్నిను నాదు పుత్రుగా
నే ననుకొంటిఁగాని, భువి నిండిన చీఁకటి పాపునట్టి వి
జ్ఞానిగ నెంచఁ జాలని యశక్తుఁడనైతిని ! నిన్ను నాదు సం
తానముగాఁ దలంచితిని, తండ్రివి కాదె సమస్త సృష్టికిన్. 39

నీదు సిద్ధాంతములు ధారుణీస్థలాన
శాంతి దేవత నివసించు సౌధపంక్తి
నీదు శిష్యులలో నొక్కనిగను నన్ను
చేర్చుకొని పుణ్య పథమును చేర్చుమయ్య." 40

పతిదేవుని కనుఁగొని శ్రీ
తతినే కనుఁగొన్న రీతి పరవశమున నా
సతి మైమఱచె, యశోధర
పతిభక్తికి మారుపేరు భరతావనిలో : 41

జనకుండని పరువెత్తక
వినయ వినమితోత్తమాంగ విజ్ఞానిగ వం
దన మాచరించి నిలిచెను
తనయుఁడు రాహులుఁడు భక్తి తత్పరమతియై : 42

"బుద్ధం శరణం" అని తన
యొద్దకు నరుదెంచు ప్రజ మహోత్సవమున నే
ప్రొద్దును తలపఁగ గౌతమ
బుద్ధుఁడు బోధింప సాగె మోక్షార్థంబుల్. 43

సత్యం బహింసయు సర్వథా తల దాల్పుఁ
డంచు నెల్లరకు బోధించు వారు,
వికలాంగులకు నన్నివిధముల నుపచార
ములు చేసి కారుణ్య మొలుకువారు,

చలిచీమలకు నెగ్గు తలఁపక నడయాడి
సమతా స్వభావంబు చాటువారు,
కఱకు క_త్తికి కుత్తుకకు మధ్యలో నిల్చి
జీవహింసను మాపుచేయువారు,

గురుని యుపదేశములు సర్వనరుల కెదుట
నాచరించుచుఁ బలుకుచు ననవరతము
సేవ చేతురు మునివరు శిష్యులౌర
ధరణి శాంత్యహింసల యవతారములుగ ॥ 44

దేశ దేశాలు బుద్ధ సందేశ మందు
తనివి చెందెను ! కడుపార కనిన నీవు
ధన్యవైనావు భరతాంబ ! తరతరాలు
పొగడు నీగర్భ ఫలము నో పూజ్యురాల. 45



